**సంప్రదాయ మంగళహారతులు**

ఘుల్లుఘుల్లున పాద గజ్జెలందెలు మ్రోయ । కలహంసనడకల కలికీ యెక్కడికే ।
జడలోన గంగను ధరియించుకొన్నట్టి। జగములేలు జగదీశు సన్నిధికే॥మంగళం॥

బొండుమల్లెలుజాజి దండాలు మెడనిండా । అందమెరిగిన జగదాంబ యెక్కడికే ।
అందము విభూతి అలరు శ్రీగంధము । నలదిన నీలకంఠేశు సన్నిధికే॥మంగళం॥

తళతళమనురత్నతాటంకములు మెరయ । పసిడిమండలముల పడతి యెక్కడికే।
కలియుగజన్మముగలశివుడైనట్టి। గురుపైనసాంబు శంకరుని సన్నిధికే॥మంగళం॥

హెచ్చుపాపటబొట్టురత్నకిరీటము। ఏమమ్మకరుణకటాక్షి యెక్కడికే।
కడుపెద్దరుద్రాక్షమెడలోహారముదాల్చి। నందినెక్కెడుజగదీశుసన్నిధికే॥మంగళం॥

చెంగావిచీరలుకొంగులుచెంగున । జారంగరంగైననవమోహనాంగి యెక్కడికే ।
చంద్రునిశిరసునధరియించుకొన్నట్టి। మండలమేలే నందీశు సన్నిధికే॥మంగళం॥

సన్నంపునడుముపైబిళ్ళలఒడ్డాణము। మెరిసేటిబంగారు బొమ్మయెక్కడికే ।
కన్నులుమూడు భుజంగంబులారు। గల అర్ధనారీశు శివునిసన్నిధికే॥మంగళం॥

******

పార్వతీవల్లభాయనందిభృంగిసేవితాయ। ఆనందతాండవాయ అమితమంగళం॥

1.కార్తికేయగురువరాయకామితార్థదాయకాయ। శ్రీగిరీవాసితాయచారుమంగళం॥
ఫాలచంద్రశేఖరాయభూరిభూతిచర్చితాయ। పన్నగేశహారాయపరమమంగళం॥

2.రుద్రరూపధరాయరుద్రాక్షమాలికాయ। స్ఫటికసదృశదేహాయశుభగమంగళం॥
ఆద్యంతరహితాయఅదిదేవదేవాయ। అభయవరదాయకాయ అతులమంగళం॥

3.బ్రహ్మేంద్రార్చితాయవిష్ణుహృదయవాసాయ।యోగీశ్వరేశ్వరాయయుక్తమంగళం॥
మహామహితాన్వితాయ మదనదేహ దగ్ధ కాయ । మేరుశృంగాగ్రాయ మహితమంగళం॥

4.భవబంధమోచకాయ భవ్యమంత్రరూపాయ । భక్తజనమోదకాయ భూరిమంగళం॥
భైరవానందహృదయ వేదినటన నటవతంసాయ । ఆనందభైరవాయ అఖిలమంగళం॥

*******

శ్రీలలితా శివ జ్యోతి సర్వ కామదా । శ్రీ గిరి నిలయా గిరామయ సర్వ మంగళా।
శ్రీ లలితా శివ జ్యోతి సర్వ కామదా॥

1.జగముల చిరు నగముల పరిపాలించే జననీ। అనయము మము కనికరమున కాపాడే జననీ।
మనసే నీ వశమై స్మరణే జీవనమై। మాయని వరమీయవె పరమేశ్వరి మంగళ హారతి.।
శ్రీ లలితా శివ జ్యోతి సర్వ కామదా । శ్రీ గిరి నిలయా గిరామయ సర్వ మంగళా।
శ్రీ లలితా శివ జ్యోతి సర్వ కామదా॥

2.అందరికన్నా చక్కని తల్లికి --- సూర్యహారతి। అందాలేలే చల్లని తల్లికి --- చంద్రహారతి।
రవ్వల తళుకుల కళలా జ్యోతుల --- కర్పూరహారతి। సకల నిగమ వినుత చరణ --- శాశ్వత మంగళ హారతి।
శ్రీ లలితా శివ జ్యోతి సర్వ కామదా । శ్రీ గిరి నిలయా గిరామయ సర్వ మంగళా।
శ్రీ లలితా శివ జ్యోతి సర్వ కామదా॥

******

ఘల్లుఘల్లున పాదగజ్జెలంధెలు మ్రోగ । కలహంస నడకల కలికి ఎక్కడికే।
జడలోని గంగను ధరియించు కొన్నట్టి । జగములేలే సాంబశివుని సన్నిధికే॥ మంగళం మంగళం॥

1. తళతళమను రత్న తాటంకములు మెరయ। పసిడి కుండలముల పడతి ఎక్కడికే।
కరి చర్మాంబర ధరుడు పురహరుడైనట్టి। గురుడైన బోళా శంకరుని సన్నిధికే ॥ మంగళం మంగళం॥

2. చెంగావి చీరలు కొంగులు జారంగ । రంగైన నవమోహనాంగి ఎక్కడికే।
పులితోలు వస్త్రములు వీభూధి ధరియించు । మండల మేలే జగదీసు సన్నిధికే ॥ మంగళం మంగళం ॥

******

సాయంకాల సమయంలో సంధ్యా దీపారాదనలో। వచ్చెను తల్లి వరలక్ష్మి వచ్చెను తల్లి లలితాంబ ॥ సాయంకాల ॥

కాళ్ళకు గజ్జెలు కట్టింది ఘల్లు ఘల్లున వచ్చింది। పిలిచిన వెంటనే వచ్చింది అడిగనవన్ని ఇచ్చింది ॥ సాయంకాల ॥

అందరు చేరి రారండి పూజలు బాగుగ చేయండి। రంగుల గాజులు తేరండి ముత్తైదువులకు పంచండి ॥ సాయంకాల ॥

ధనములు ఇచ్చును ధనలక్ష్మి ధాన్యము నిచ్చును ధాన్యలక్ష్మి। వరముల్నిచ్చును వరలక్ష్మి సంతానమునిచ్చును సంతానలక్ష్మి ॥

॥సాయంకాల ॥

వజ్రకిరీటం చూడండి ముత్యాలహారం చూడండి। నాగాభరణంచూడండి దేవీ రూపం కనరండి ॥ సాయంకాల ॥

******

రామచంద్రాయ జనక రాజజా మనోహరాయ। మామకాభీష్టదాయ - మహిత మంగళం॥

1. కౌసలేయాయ మందహాస దాస పోషణాయ। వాసవాది వినుత స ద్వరద మంగళం॥

చారుకుంకుమోపేత చందనాను చర్చితాయ। హారకటక శోభితాయ భూరి మంగళం॥

2. లలిత రత్నకుండలాయ తులసీ వనమాలికాయ। జలజసదృశ దేహాయ చారు మంగళం॥

దేవకీ పుత్రాయ దేవదేవోత్తమాయ। చావజతగురువరాయ భవ్యమంగళం॥

3. పుండరీకాక్షాయ పూర్ణచంద్రాననాయ। అండజాత వాహనాయ అతుల మంగళం॥

విమల రూపాయ వివిధవేదాంత వేద్యాయ। సుజన చిత్తకామితాయ శుభగ మంగళం॥

4. రామదాస మృదుల హృదయ తామరస నివాసాయ। స్వామి భద్రగిరి వరాయ సర్వమంగళం॥

రామచంద్రాయ జనక రాజజా మనోహరాయ। మామకాభీష్టదాయ మహిత మంగళం॥

*****

ఘల్లుఘల్లునా పాద గజ్జెలందెలు మ్రోగ। కలహంస నడకల కలికీ ఎక్కడికే॥

వైకుంఠ వాసుని పాదపద్మములకు। భక్తితోనే మరచి పూజ చేయుటకే॥

అమ్మా మంగళం జయ మంగళం॥

పదహారు కళలతో పారాణి ఆరాక। రమణీ పద్మావతీ పరుగూ లెక్కడికే॥

తిరుమలలో నివసించేశ్రీ వేంకటేశ్వరుని। వైభవము వేడుకలు చూచుటకే॥

అమ్మా మంగళం జయ మంగళం ॥ ఘల్లుఘల్లునా ॥

పవళించే వేళాయె పట్టుచీరకట్టి। తలనిండ పూలతో తరుణి ఎక్కడికే॥

లోకాల నేలేటి లోకబాంధవునితో। వుయ్యాల లూగుటకు వెళ్ళీ వస్తా॥

మంగళం శుభ మంగళం ॥ ఘల్లుఘల్లునా ॥

ప్రతియేట మా ఇంట పూజలందుకొనుచూ। దయదలచి దనమిచ్చే ధనలక్ష్మి నీవే॥

ఎల్లపుడూ భ క్తి తో పూజించేవారికి। వరమూలు ఇచ్చేటి వరలక్ష్మి నీకే॥

మంగళం జయమంగళం ॥ ఘల్లుఘల్లునా ॥

*****

శీతాద్రి శిఖరాన పగడాలు తాపించు । మా తల్లి లత్తుకకు నీరాజనం।

కెంపైన నీరాజనం । భక్తిపెంపైన నీరాజనం ॥

యోగీంద్ర హృదయాల మ్రోగేటి మాతల్లి । బాగైన అందెలకు నీరాజనం।

బంగారు నీరాజనం । భక్తి పొంగారు నీరాజనం॥

సెలతాల్పు డెందాన వలపు వీణలు మీటు। మాతల్లి గాజులకు నీరాజనం।

రాగాల నీరాజనం । భక్తి తాళాల నీరాజనం ॥

మనుజాళి హృదయాల తిమిరాలు సమయించు। మాతల్లి నవ్వులకు నీరాజనం ।

ముత్యాల నీరాజనం। భక్తి నృత్యాల నీరాజనం॥

చెక్కిళ్ళ కాంతితో క్రిక్కిరిసి అలరారు। మా తల్లి ముంగురుల నీరాజనం ।

రతనాల నీరాజనం। భక్తి జతనాల నీరాజనం॥

పసి బిడ్డలను చేసి ప్రజనెల్ల పాలించు। మాతల్లి చూపులకు నీరాజనం ।

అనురాగ నీరాజనం । భక్తి కనరాగ నీరాజనం ॥

దహరాన కనిపించు ఇనబింబ మనిపించు। మాతల్లి కుంకుమకు నీరాజనం ।

నిండైన నీరాజనం । భక్తి మెండైన నీరాజనం॥

తేటి పిల్లల వోలె గాలి కల్లల నాడు। మాతల్లి కురులకు నీరాజనం ।

నీలాల నీరాజనం। భక్తి భావాల నీరాజనం ॥

జగదేక మోహిని సర్వేశ గేహిని। మా తల్లి రూపునకు నీరాజనం।

నిలువెత్తు నీరాజనం । భక్తి విలువెత్తు నీరాజనం॥

*****

సౌభాగ్యలక్ష్మీ రావమ్మా సౌభాగ్యలక్ష్మీ రావమ్మా అమ్మా

1.నుదుట కుంకుమ రవిబింబముగ కన్నులనిండుగ కాటుక వెలుగ ।
కాంచనహారము గళమున మెర యగ పీతాంబరముల శోభలునిండగ॥ సౌభాగ్య॥

2.నిండుగ కరముల బంగరుగాజులు ముద్దులొలుక పాదమ్ముల మువ్వలు ।
గలగల గలమని సవ్వడి చేయగ సౌభాగ్యవతులసేవలనందగ॥ సౌభాగ్య॥

3.నిత్యసుమంగళి నిత్యకళ్యాణి భక్తజనులకూ కల్పవల్లి ।
కమలాసనపై కరుణనిండగా కనకవృష్టి కురిపించే తల్లి ॥ సౌభాగ్య॥

4.జనకరాజుని ముద్దుల కొమరిత రవికులసోముని రమణీమణివై ।
సాధుసజ్జను లపూజలందుకొని శుభములనిచ్చెడి దీవనలీయగ ॥ సౌభాగ్య॥

5.కుంకుమ శోభిత పంకజలోచని వెంకటరమణుని పట్టపురాణి ।
పుష్కలముగ సౌభాగ్యమునిచ్చే పుణ్యమూర్తి మాయింట వెలసిన ॥ సౌభాగ్య॥

6.సౌభాగ్యమ్ముల బంగరుతల్లి పురందర విఠలుని పట్టపురాణి ।
శుక్రవారంబు పూజలందుకొన సాయంసంధ్యా శుభఘడియలుగా ॥ సౌభాగ్య॥

*****

శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥
శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

నోచినవారికినోచినవరము। చూసినవారికిచూసినఫలము।
శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా
మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

స్వామినిపూజించేచేతులెచేతులటా। ఆ మూర్తినిదర్శించేకనులేకన్నులటా।

స్వామినిపూజించేచేతులెచేతులటా। ఆ మూర్తినిదర్శించేకనులేకన్నులటా।

తనకథవింటేఎవ్వరికైనాజన్మతరించునటా।
శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా
మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

ఏవేళైనా ఏశుభమైనాకొలిచేదైవంఈదైవం। ఏవేళైనా ఏశుభమైనాకొలిచేదైవంఈదైవం।

అన్నవరంలోవెలసినదైవంప్రతిఇంటికిదైవం।
శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా
మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

అర్చనచేద్దామామనసుఅర్పణచేద్దామా। స్వామికిమదిలోసేకోవెలకడదామా।

అర్చనచేద్దామామనసుఅర్పణచేద్దామా।స్వామికిమదిలోసేకోవెలకడదామా।

పదికాలాలుపసుపుకుంకుమలు ఇమ్మని కోరేమా।
శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా। మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా
మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

మంగళమనరమ్మాజయమంగళమనరమ్మా। కరములుజోడించిశ్రీచందనమలరించి
మంగళమనరమ్మాజయమంగళమనరమ్మా। కరములుజోడించిశ్రీచందనమలరించి
మంగళమనరేసుందరమూర్తికివందనమనరమ్మా।శ్రీసత్యనారాయణునిసేవకురారమ్మా।

మనసారస్వామినికొలిచిహారతులీరమ్మా॥

*****